# దైవస్తుతి

రచన:

శ్రీమతి కె. సరోజ
కెనడా

శ్రీ సరోజిని పబ్లిషింగ్ హౌస్
29-37-134/2 ఏలూరురోడ్.
విజయవాడ-2.

DAIVA STUTHI

by

Smt. K. SAROJA
Canada

First Edition :
JUNE, 1994

Price ; Rs. 15-00

Cover Design :
V. S. PRAKASH

Printed at :
SRINIVASA PRINTERS
Eluru Road,
VIJAYAWADA-520 002,
Phone : 74932

# అంకితం

అందరు దైవముల పాదాబ్జములకు
ఆనంద రస కవితా హృదయముతో

— సరోజ

# ధన్యవాద సుమాంజలి

"దైవ సన్నుతి" వచన కవితా సంకలన ప్రచురణకు శ్రమ తీసుకుని నా కోర్కె మేరకు శ్రీ మహాలక్ష్మీస్తుతి, శ్రీ వేంకటేశ్వరస్తుతి అనువాదంచేసి, వారు నమ్మిన దైవం శ్రీ సత్యసాయిబాబాగూర్చి కవితవ్రాసి, స్పెషల్ డెలివరీ పోస్టులో పంపిన డా॥ ఎ. సుదర్శన రాజుగారికి, శ్రీ విఘ్నేశ్వరస్తుతి అనువదించిన డా॥ దేవేంద్ర చలపతిరావుగారికి, శ్రద్ధతో ప్రింటుచేసి సకాలంలో అందజేసిన శ్రీ సరోజిని పబ్లిషింగ్ హౌస్ మురళీగారికి, ఈ సంకలన విడుదలకు నాకు చేయూత నిచ్చిన ప్రతి వ్యక్తికీ, దేవాలయాలద్వారాకానీ, మా ద్వారాకానీ దైవసన్నుతి పుస్తకం కొన్నే ప్రతివారికీ ఈ కవితా మాలలోని వారివారి ఇష్టదైవాలు వారందరికీ ఆయుఃరారోగ్య ఐశ్వర్యాలను ప్రసాదించుగాక. వీరందరికీ ప్రత్యేకంగా నా కృతజ్ఞతలు తెల్పుతున్నాను.

భగవంతుడి దయవల్ల శారదాదేవి కటాక్షంవల్ల ఈ కవితలు వ్రాయగల్గాను కానీ నాకు కవిత్వం రాదని చెప్పటం ఎంతైనా సమంజసం. హృదయంలోనుండి పెల్లుబికి వచ్చిన ఈ వచన కవిత్వం నా తృప్తికొరకు, నాబోటి సామాన్యుల కొరకే కానీ కవి, పండిత, విమర్శకులకోసం కాదని మనవి.

ఈ దైవసన్నుతి ఇండియా, ఉత్తర అమెరికా శ్రీ వేంకటేశ్వర ఆలయాల్లో నాచే విరాళంగా ఒసగబడుతుందని తెలియజేయటానికి అమితంగా ఆనందిస్తున్నాను.

— కె. సరోజ

# ఇది వరస....







# శ్రీ టొరంటో విఘ్నేశ్వర స్తుతి

1. శ్రీ విఘ్ననాయక పురుషోత్తమ
నిశ్చల నిర్వికార తేజో విలాస
దివ్య మంగళ పంకజనయన
శ్రీ టొరంటో విఘ్నరాజా !

2. శ్రీ ఏకదంత చిత్ర విచిత్ర
విన్యాస సుందర వదనారవింద
నిత్యపూజలు గైకొను ధీశాలి
శ్రీ టొరంటో విఘ్నరాజా !

3. శ్రీ లంబోదర సలలిత
లౌక్య నిరాడంబర నిర్మల
నిరహంకార చిద్విలాస
శ్రీ టొరంటో విఘ్నరాజా !

4. శ్రీ వక్రతుండ నటరాజ
అనుంగు తనయా
నిత్యాభిషేక నవ వన్నెల కాంతి బాలక
శ్రీ టొరంటో విఘ్నరాజా !

5. శ్రీ ఫాలచంద్ర గౌరీసుత
గణాధిప అపూర్వ వరప్రసాద
ప్రజ్వాల శక్తి ప్రణీత
శ్రీ టూరంటో విఘ్నరాజా !

6. శ్రీ శూర్పకర్ణ మణిరాజిత
త్రిలోక తిమిరాపహార
సుందర ప్రమథగణ సేవిత
శ్రీ టూరంటో విఘ్నరాజా !

7. శ్రీ హేరంబ శ్యామ వక్త్ర
యజ్ఞోపవీత సకల చరాచర
ప్రస్తుత విమల విశ్వరూప
శ్రీ టూరంటో విఘ్నరాజా !

8. శ్రీ కుమారస్వామి సన్నిహిత
సత్సోదర దీప్తి వల్లభ
కాత్యాయనీ కనుసన్నల కుసుమశోభిత
శ్రీ టూరంటో విఘ్నరాజా !

9. శ్రీ కైలాసగిరి నుండి
కదలి వచ్చిన కరుణాలవాల
భక్తులను దీవించి సత్కాంక్షలీడేర్చు
శ్రీ టూరంటో విఘ్నరాజా !

10. శ్రీ వినాయక విజయీభవ
కుడుముల ఉండ్రాళ్ళ నిష్ఠా గరిష్ఠా
దుష్టశిక్షణా శిష్టరక్షణకై వెలసిన బాలకుమారా
అందుకొనుము నా వందన సహస్రంబు
శ్రీ టూరంటో విఘ్నరాజా !

# Sri Vighneswara, Lord of Victory, Toronto

(Dr. C. R. Chevendra, London, Canada)

Lord of Lords, Ganesha bestow upon us success,
You always allure us with your regal attire
wherever you abode,
Your lotus-like eyes are a feast to our eyes,
Oh, Vighneswara, Lord of Victory, Toronto !

You are a unitusked Lord
portraying and presenting yourself pleasingly,
Please accept our daily offerings graccfully,
Oh, Vighneswara, Lord of Victory, Toronto !

You are a Lord with a great belly full of
benevolence, humbleness, tranquillity
and ever cheerfulness,
Oh, Vighneswara, Lord of Victory, Toronto !

You are a King among dancers with a curved trunk,
And a loving deity worshipped unequivocally,
Rising, emerging and radiating as brilliant
as a new moon,
Oh, Vighneswara, Lord of Victory, Toronto !

You are born to a great man (having Moon
on forehead) Lord Siva and his wife Gowri,
Blessed with innumerable boons,
Possessed infinite unfathomable power,
Oh, Vighneswara, Lord of Victory, Toronto !

With ears bearing twinkling and dazzling
precious stones,
You encircled all the three worlds, and
Respected, worshipped and praised by one and
all, first and foremost,
Oh, Vighneswara, Lord of Victory, Toronto !

With the sacred band across your shoulders,
bearing glittering diamonds,
Assumed the shape of Universe embedding
all plants, animals, and
living beings of creation,
Oh, Vighneswara, Lord of Victory, Toronto !

Joined and enlightened by your loving brother,
And cuddled and nurtured in the shadow of
universal mother, Gowri,
Oh ! Vighneswara, Lord of Victory, Toronto !

You descended from the Mount Kailasa mercifully
to bless the devotees and grant their wishes,
Oh, Vighneswara, Lord of Victory, Toronto !

Let us all praise the Lord of Victory, Vighneswara
who loves the balls made out of rice flour,
who punishes the sinners and saves the virtuous,
Please accept our thousand-fold salute
with folded hands,
And grant us success in all our endeavours,
Oh, Vighneswara, Lord of Victory, Toronto !

(Free verse translation to Smt. K. Saroja's
Sri Toronto Vighneswara Stuthi)



# శ్రీ వేంకటేశ్వర సన్నుతి

1. శ్రీ వకుళ తనయా ! వారిజనయనా !
దీనజన రక్షకా ! దాక్షిణ్య కిరణా !
పాలింపవయ్యా ! పాప పంకిల హరణా !
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

2. మా వేంకటేశా ! మహరాజ చిద్విలాసా !
ఎటుల వచ్చితివయా మా ఇష్టదైవం !
శేషపాన్పును వీడి శైలంబు వదలి
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

3. వడ్డికాసులవాడా ! శ్రీ వసుధ నాథా !
ఊహ తెలిసిన నాటినుండీ భక్తితో
నీదు సుప్రభాతమే పఠియించితిని
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

4 ఏడుకొండలవాడా ! ఎరుక చెప్పిన స్వామీ !
నిన్నే ధ్యానించి భజియించి కొలిచితి
శరణన్న నా పట్ల దయలేద నీకూ !
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

5. పాణిగ్రహణంబు నే చేసినవేళ
నుదుట భాషికము తళుకులీనిన వేళ
మరువలేదు నిన్ను మదిలోన తండ్రీ
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

6 సప్తపదీనంబు నే చేసినవేళ
సన్నాయి బేండులు వీందొనరించినప్పుడు
తలంబ్రాల తన్మయములో మరువలేదు నిన్ను
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

7. పూల వాహనమెక్కి నే ఊరేగినపుడూ
మగని చిరునవ్వుల నే తేలినపుడూ
చిత్తమందు నీ రూపు చెక్కు చెదరలేదు
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

8. నాగవల్లిలో చిరునవ్వు నవ్వినపుడూ
మధుపర్కముల పసుపు మెరసినపుడు
నా మ్రొక్కు చెల్లించి నీ కొండ ఎక్కాను
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

9. తులతూగు సిరిని కాంక్షించలేదు
శ్రీమంతుల చూచి ఈర్ష్య చెందలేదు
గౌరవించి సత్కరించాను జనులను
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

10. పుత్రోత్సాహము నే పొందినపుడూ
పుత్రికాములను నే బడసినపుడూ
ప్రథమముగ నీ నామమే ఉచ్ఛరించితినీ
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

11. నా గ్రంథ ప్రచురణ కావించినపుడు
అంకితంబిచ్చితి నీకు అలమేలుమంగతోడ
నా తప్పిదంబేదియొ తెలియకున్నది తండ్రి
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

12. కన్నవారిని నేను కసిరి కొట్టితికాని
కలనైన నిన్ను త్రోసిరాజనలేదు
ఎందుకో కినుక నాపైన వివరించవయ్యా !
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

13. కలడు కలండనెడివాడు కలడో !
లేడో ! యని కరిరాజు మొరలిడగా
పరుగున చని రక్షించితివే !
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

14. రక్కసులను చీల్చి చెండాడితివిగా !
ఈ కలియుగంబున శిలవైతివేమి !
నిదురించు చుంటివా ఓ చక్రధారీ !
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

15. చలికి తాళలేను సాగరములు దాటలేను
ఆంధ్రదేశము నిచ్చట సృష్టించవయ్యా
లేక నీ అమెరికా శాఖకు నన్ను చేర్చవయ్యా
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

16. శ్రీలు విలసిల్లు ఈ నగర ఆలయమునందు
శ్రీదేవితోగూడి సల్లాపముగను
ముద్దుముచ్చటలు జరుపుకొను చిత్రప్రభావ
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

17. దుష్టశిక్షణ మరచి నువ్వు
శిష్టశిక్షణా దుష్టరక్షణ చేయుచుంటివా !
ఆపద మ్రొక్కులవాడా ! లంచాల రాయుడా !
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

18. లంచాలు నీకు నేను ఇవ్వజాలననియు ?
నిలువు దోపిడి నా వల్లకాదనియా !
ఏమిటో నీ అలుకకు కారణంబు !
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

19. కారణము తెలియని ఆగ్రహంబు
తగునటయ్యా నీకు తల్పశాయీ !
పలుకు తేనెల తండ్రి పరమ పురుషా
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

20. పద్మావతమ్మకు వివరించవలెనా !
అలమేలుమంగకు బోధించవలెనా !
తెలుపవయ్యా ! అఖిల భువనాధారా
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

21. ఎవ్వరీ వేంకటేశుండు
ఎచటివాడీ శ్రీనివాసుండనుచు
ఉత్తర భారతీయులు కురిపించుచున్నారు ప్రశ్నలు
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

22. విష్ణువే రాముడూ ! రాముడే కృష్ణుడూ
కృష్ణుడే మా వేంకటేశుండని వేనోళ్ళ పొగడి పొగడి
నేను అలసితిని ఓ అంబుజాక్షా !
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

23. నీదు మహిమ చూపవయ్యా !
దుష్టులను నా దరికి చేర్చకయ్యా
సంపద నీయకున్ననూ సరియుందు నెటులో
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

24. శేషాద్రి నిలయా ! వచనకవితాధారా
సన్నుతిమాలను గళమందు ధరియించుమయ్యా
సకల సౌభాగ్యవతి యనుచు నన్ను దీవించవయ్యా
కరుణా సముద్రా ! కళ్యాణ శ్రీనివాసా !

# My Merciful Lord, O Srinivasa

(Dr. Sudarsan Raj, Edmonton, Canad

O son of Vakula ! our vivacious Lord
Saviour of sinners and merciful Lord
Forgive our faults and guide us Venketesa
My merciful Lord, O Srinivasa.

O Venkatesa ! Chief of Gods
How did you come to this land ! our favorite Lor
Leaving your abode of Ananta bed Venkatesa
My merciful Lord, O Srinivasa.

O Lord of Earth, O Lord of wealth
I wake you up every morning until my death
I pray to you with veneration Venkatesa
My merciful Lord, O Srinivasa.

O Lord of seven hills, O Lord of compassion
I prayed with emotion, and meditated in seclusio
Longing for your blessings Lord Venkatesa
My merciful Lord, O Srinivasa.

In the worst of times, and in best of times
In the heat of night of my wedding night
Never I forgot you, O Venkatesa
My merciful Lord, O Srinivasa

While I was going around the fire in seven steps
While my lover was throwing sacred rice in funny pep
Never I forgot you, Lord Venkatesa
My merciful Lord, O Srinivasa.

Remembering you ever, and forgetting never
Between wedding vows, and pranks of my lover
Going around the town in a palanquin
of flowers, Venkatesa
My merciful Lord, O Srinivasa.

Never I forgot to pay my dues
Even when I was at in-laws' house
Always reached your temple step-by-step,
Venkatesa
My merciful Lord, O Srinivasa.

Ever did I beg for millions of dollars ?
Have I ever felt jealous of others ?
Why so many troubles, that is what it bothers !
My merciful Lord, O Srinivasa.

When I was blessed with a boy
Latter arrived the girls bringing joy
Only uttered I, thy name Venkatesa
My merciful Lord, O Srinivasa.

My books were published in a hurry
Dedicated to You and Manga without worry
What mistakes I committed Lord Venkatesa ?
My merciful Lord, O Srinivasa.

I scolded my parents once in a way
Never I did the same to you in any way
Why did you ignore me ? Lord Venkatesa
My merciful Lord, O Srinivasa.

When the king of elephants was in pain
Struggling with crocodile in vain
You came running to save in least hesitation
My merciful Lord, O Srinivasa.

You who tore the demons into pieces
You became a stone, why ? in these ages
Are you sleeping, or dreaming, Sri Venkatesa ?
My merciful Lord, O Srinivasa.

Chill and cold I can't bear, seas and
oceans I can't swim
Won't you create here the Andhra clime ?
Or else, change me into a cold-loving worm
My merciful Lord, O Srinivasa.

With thine consort Sridevi besides you
With fervent devotion, serving both of you
Aren't you having fun in our temple Venkatesa ?
My merciful Lord, O Srinivasa.

Did you forget your duty to punish the wicked ?
How could you punish the persons devoted !
Are you the saviour ? or bribe monger ?
Venkatesa !
My merciful Lord, O Srinivasa.

You swindle money, gold, and bribe
You better know, I don't belong to that tribe
Why dost Thou be angry Venkatesa ?
My merciful Lord, O Srinivasa.

I know not your reason for anger !
Do you think we are in danger ?
Why so much vengeance Venkatesa ?
My merciful Lord, O Srinivasa.

Should I approach through mother Padma ?
Should I plead through Alivelu Manga ?
How can I please you, Lord Venkatesa ?
My merciful Lord, O Srinivasa.

People from North question always
Who is this Balaji or Srinivas ?
What should I say my Venkatesa ?
My merciful Lord, O Srinivasa.

Vishnu and Rama are the same
Rama and Krishna are of equal fame
Krishna and You are one and the same
My merciful Lord, O Srinivasa.

Keep away the wicked from me
Show some of your miracles to me
Bless me with a glimpse Venkatesa
My merciful Lord, O Srinivasa.

Accept these verses as my gift
Please reside always in my heart
Shower you blessings, O Venkatesa
My merciful Lord, O Srinivasa.

(Free verse translation to Smt. K. Saroja's
Sri Venkateswara Sannuti)



# శ్రీరామ సంకీర్తన

1. శ్రీరామచంద్రా ! చిరుదరహాసా
ఆశ్రిత మందారా ! అయోధ్యవాసా
ఆలకింపవయ్యా దశరథనందనా
నీ నామ సంకీర్తనే నాకు తేనీటి విందు

2. కౌసల్యారామా ! కోసల దేశాధీశా !
ముగ్గురు తల్లుల గారాబు తనయుడా
వసంత ఋతువులో మధుమాసంలో
పాయసాన్న ఫలముగా జన్మించినవాడా

3. రావణ సంహార లోక కళ్యాణార్థమై
వైకుంఠమును వీడి కౌసల్య
గర్భమందు జనియించిన అవతారమూర్తి
అహర్నిశలు నీ నామమే జపియింతు నేను

4. పలికించెడివాడు రామభద్రుండటయని
శ్రీకంఠ చాప ఖండన యని
పోతనచే స్తుతియించబడిన
కీర్తికిరీటా ! ఇక్ష్వాకు కులతిలకా

5. శరత్కాల సూర్య ప్రకాశా
విశ్వామిత్ర ఆజ్ఞపాలకా
ఆర్తత్రాణ పరాయణా
బల అతిబల విద్యా పంపన్నా

6. రావణుని హతమార్చుట కాదు
వీరశౌర్యం ! మారీచ సుబాహులను
మట్టుపెట్టుట కాదు రామభద్రా
రాక్షసులయ్యా వారు ఓ రవికుల తేజా

7. మానవులలోని దానవులను
అంతమొందించుట నీకు అలవికాదా !
వారి మనసు మార్చుట నీకు దుర్లభమయ్యేనా !
మరియొక అవతార మెత్తుటకు వ్యవధిలేదా !

8. నీ నామము ధరియించి
అసత్యములాడి అపనిందలేయువారు
నీ నామమ్ము ధరియించి
మానభంగములకు ఒడిగట్టువారు

9. నీ నామము ధరియించి
పచ్చని కాపురములలో చిచ్చుబెట్టువారు
నీ నామము ధరియించి అకారణమ్ముగ
పరులన్ నిందించి కష్టపెట్టువారు

10. నీ నామము ధరియించి
దోపిడిలు చేసి హత్యలు చేయువారు
నీ అండ చూసుకుని సర్వ
దుష్కర్మము లాచరించువారు

11. దండించవేమి వారిని ధవళాబ్జపత్రనేత్రా
తాటకిని వధించుట తన్మయము కాదు
కలియుగ తాటకమ్మలకు బుద్ధిచెప్పి
ప్రపంచశాంతికి దోహదము చెయ్యవయ్యా

12. నీ నామమె పరమ పవిత్రము
నీ చరితమే వీనుల విందు
నీ పుంసాం మోహన రూపమే
పుష్ప పరిమళ భరితం

13. నిన్ను కీర్తించి ధన్యుడయ్యె త్యాగరాజు
నిన్ను భజియించి తరియించె రామదాసు
నిన్ను సేవించి ఫలము పొందిరి
అయోధ్య నగరవాసులు

14. జానకీవల్లభా ! జనక జామాతా
శిష్టరక్షణకు ప్రాముఖ్యత నొసగువాడా
రక్షించవయ్యా నన్ను మునిజన వందిత
రామరాజ్యములోని రమ్యతను ఒసగవయ్యా

15. మనసులోని మాయ తొలగింపవయ్యా
నీ దయా పారిజాతాలు పరిమళించాలయా
నీ ప్రసన్న వదనమే నాకు రక్ష అయ్యా
పవనసుతుని ఘనత నాకు వెలుగుబాటయా

16. మీ కళ్యాణోత్సవము నాకు
కనుల పండుగయ్యె
భద్రాచలములోన నెలకొన్న రామా
నన్నేలు కోవయ్య ఓ భక్త వరదా !

17. చైత్ర నవమినాడు జరుగు
నీకు కళ్యాణ వైభవం
పుట్టిన రోజునాడే వైవాహికోత్సవం
ఏమి అదృష్టమయా నీకు శ్రీరామచంద్రా

18 మీ పసుపు వస్త్రాల మెరుపు
భాషికాల జిలుగు
పసుపుపచ్చని తలంబ్రాల సొగసూ
కళ్యాణ తిలకపు సౌందర్య రేఖ

19. తిలకించవలెనని కాంక్షించుచుంటి
మా టొరంటో ఆలయ నివాసా
ఇచట నీ కళ్యాణ వైభవము ఆంధ్రదేశములోవలె
వీక్షించు భాగ్యము కల్గించు నాకు

20. ధన ధాన్యముల్ పాడిపంటలు
ఒసగుమని ప్రార్థించుటలేదు నిన్ను
నీ కళ్యాణశోభ తిలకించు ప్రాప్తి
కల్గించిన చాలు ఓ కోదండ రామా!

21. చిన్ననాడు మా గ్రామమందు
శ్రీరామ నవమినాడు
నేను కనులార గాంచిన
నీ కళ్యాణ ఘడియలు

22. మరపురావు నాకు ఎన్నటికిని
అ ఆనందమునకు నేను
దూరమైతిని ఇపుడు
కొమరవోలు మాట కల్లకాదు

23. సీతా లక్ష్మణ ఆంజనేయ
సమేతుడవై దర్శన మియ్యవయ్యా
ఇలనైన కలనైన కవిత్వమందైన
నీ తలంబ్రాలు చూడవలె నేను

24. శ్రీరామ జయరామ యనుచు
ధ్యానింతు నిన్ను మరువకయ్యా నన్ను
శాంతి చక్రము నింద ధైర్యరసము నింపి
ఆశీర్వదించు ఓ పట్టాభిరామా !



# శ్రీ ఆంజనేయ స్తవం

1. శ్రీ వాయుపుత్రా ! ప్రసన్నాంజనేయా
శ్రీ రామ దిగ్విజయ కారణా భరణా
నీ దండకంబే మాకు శ్రీరామరక్ష
శాంతి ధైర్యము నాకు ఒసగవయ్యా

2. సర్వానిష్ట నివారకంబనుచూ
పఠియించితీ స్మరియించితీ నీ నామము
పరీక్షలు వ్రాయు సమయమందునూ
భయకంపితనైన వేళయందునూ

3. ఆ సమయము ఈ సమయమను
భేదములేక స్తోత్రము కావించితిని
నీ స్తవమే నాకు విజయ ధైర్యములను
ఒసగి నన్ను ఆనందపరచినది ఓ వీరాంజనేయా !

4. భీమసేనుని శక్తి సామర్థ్యములు
పరీక్షించితివిగదయ్యా
సీతాన్వేషణా బుద్ధిబల సంపన్నా
భజియింతు నిన్ను బహుముదముతోడ

5. బ్రహ్మచారీ ! అమోఘ ఉపాయకారీ
చూచి రమ్మన్నచో కాల్చివచ్చిన
కీర్తిరథసారధీ ! మా హనుమంతా
మహదానందముగ నీకు అప్పాలు చేతునయ్యా

6. ఈ టొరంటో నగరమందు
పట్టాభిరాముడి పాదాల చెంత
బంటువై నిలచిన బహుజనవందితా
ఆకుపూజ నీకు చేయింతునయ్యా

7. ధైర్యమొక్కటే చాలదో పవనతనయా
ధనము కావలెనయ్యా నాకు
నీ పూజ చేయించుటకు కూడ
ధనము చేకూరు మార్గము సూచించవయ్యా

8 దివ్యబల తేజోమయా
దయా మానస సముద్రా
ఈ లోకమందు జీవనము గడుపుటకు
వలయు శక్తియుక్తులియ్యవయ్యా !

9. సంకట హరణా ! మారుతీ
నీ ఆకృతి వానరాకృతి అయిననూ
నీ మనస్సు ఉదయ కిరణ సౌందర్యం
కనుక నే నీ రూపు నాకు సుందరంబుగ నుండు

10. నీ అండ చూసుకుని
అగడంబులు చేయు నీ భక్త మానవుల్
మితిమీరుచున్నారు కొందరు
అయిననూ వారికి సద్బుద్ధి ఒసగవేమి

11. కారణంబేమిటయ్యా శ్రీరామభక్తా !
వారధి నిర్మించి రావణ సంహారమునకు
తోడ్పడిన గదాయుధా ! కాంచనాభరణా
రత్నకిరీటా ! రసమయ చరితా !

12 దుష్టశక్తులను పారద్రోలు ఓ వజ్రగాత్రా
సాహసమ్మును వరముగా నొసగి నన్ను దీవించి
ఈ నా కవితా భావ తరంగ
కెరట సౌజన్య కుసుమాంజలిని స్వీకరించు
సూక్ష్మరూపా !



# శ్రీకృష్ణ స్తుతి

1. శ్రీ బాలకృష్ణా యదునందనా
నీ ముగ్ధమోహన రూపము
కనులార గాంచి ముద్దాడవలెనని
నాకు ప్రేమ ఉప్పొంగుచున్నది తండ్రీ

2. అమ్మ యశోదకు చెప్పి
రాధత్తకు తెలిపి రావయ్యా
మా ఇంటికి ఓ వేదాంతవేద్యా
నా కోర్కె తీర్చవయ్యా ముద్దుకృష్ణా !

3. ఈ టొరంటో నగరమందు
ఎటుల వెలసితివయ్యా నువ్వు కళ్యాణ కృష్ణా !
తెల్లవారి సేవలకు సంతసించితివి కదా
ధన్యచరితులయ్యె వారు నీ దాసులయ్యా

4. అమ్మ యశోదతో దాగుడుమూత
లాడుచూ దారితప్పి వచ్చితివో !
గోపెమ్మల చీరలు దాచుటకై
పరుగున వచ్చితివో ! వెన్నకై వచ్చితివో !

5. బృందావనము వీడి
విహారమునకు విచ్చేసితివో !
మోహన మురళీ గానవిలోలా
కారుణ్యము చూపి, సాక్షాత్కరించవయ్యా

6. నీ నెమలికన్ను సవరించవలెననీ
నీ మావి పిందెలు తిలకించవలెననీ
నీ ఆట పాటలు చూడవలెనని
మనసు ఏదో సందేశమిచ్చుచున్నదయ్యా !

7. నీ రూపమే నాకు స్వర్గధామము
కౌస్తుభధారీ ! కస్తూరి తిలకా
దర్శన మియ్యవయ్యా ఓ చిన్నికృష్ణా !
సన్నుతింతునయ్యా నిన్ను శక్తికొలది

8. పూతన సంహారా ! కంస చాణూర మర్దనా !
నీ గానమె నా మానసవీణ ఓ దేవకీ పుత్రా
నీ పలుకే నాకు పన్నీటివాన ఓ గోవిందా
నిన్ను లాలించవలెనని వాంఛ కల్గినదయా !

9. కరుణా భరణా గోవర్ధన గిరిధారీ
కాళీయమర్దన అభయహస్త ప్రదాత
నిన్ను ఎత్తుకుని ముద్దాడవలెనను కోర్కె
క్షణక్షణమునకు అధికమగుచున్నదయ్యా

10. రిపు సంహారణా ! గోపాలా
నన్ను బ్రోవరావయ్యా కేశవా
అలసించకయ్యా ఓ అచ్యుతా
నీ రాకకై నా ఇంటి ముంగిట వేచివుందు నయ్యా

11 వసుదేవ పుత్రా ! మువ్వగోపాలా
నీ మురిపాల మధురిమలు
చవిచూడవలెనో సుజన మందారా
భక్తితోడ కొలిచితి నిన్ను ఓ సుందరాంగా

12 మోహనరూపా మురళీకృష్ణా
కదలి రావయ్యా నిన్నే నమ్మితినయ్యా
నన్ను సంతసింప చెయ్యవయ్యా
నీ నగుమోము చూపవయ్యా

13. నిన్ను స్తుతియించి లిఖియించి
కావ్య రసాస్వాదనలో
ముక్తినొందె బమ్మెర పోతనామాత్యుడు
నీచే సంహరింపబడి మోక్షమందె శిశుపాలుడు

14. గోపీ మనోహరా ! మృదుమధురస్వామీ
రుక్మిణీ కళ్యాణంబు కనులారగాంచి
బహుకాలమైనదయ్యా భక్తజన పోషకా
కావుమయ్యా నన్ను నందరాజకుమారా

15. రుక్మిణీ కళ్యాణంబు నే పఠియించితిని
నా బాల్యమందు ఓ అరివీర భయంకరా
ఆలసింపక నువ్వు నీ మహిమ చూపితివి
ఇపుడు నీ మహిమ ఘనీభవించినదా కృష్ణా !

16. జనార్ధనా ! జాలిలేదా నా పైన
అలనాడు నీ నేస్తము కుచేలుని
దరిద్రము బాపి అష్టఐశ్వర్యములతో
ఆశీర్వదించితివికదా ఓ నీరజాక్షా !

17. ఒక్కసారి రావయ్యా నా ఇంటికి
అరగుప్పెడు అటుకులను
ఆరగించవయ్యా ప్రేమమీరగా
నిన్ను సత్కరింతునయ్యా నేను శక్తివంచనలేక

18. క్రీడామయా ! పార్థసారథీ
ద్రౌపది పిలిచినంతనే ఆలసించక
ఆర్తితో ఆదుకొంటివి కదా
మరి ఈ కలియుగములో కథ ఇంతేనా !

19. ఈ లోకమందు దుర్యోధన
దుశ్శాసన శకుని మామలను
సృష్టించితివిగానీ నువ్వు
వైకుంఠమందు విశ్రాంతి పొందుతున్నావుగదయ్యా !

20. ద్వారకా నగరవాసా
దరిచేర రావయ్యా దేవదేవ
నీ దర్శనార్థం, నీ సాన్నిధ్యము కొరకు
తహతహలాడిరి గోపికలు

21. ఆ గోపికలను పెద్దలు
కట్టడిచేయగా వారి మనసు
గ్రహించి వారి గృహములందే
సాక్షాత్కరించితివిగా ఓ కృష్ణచంద్రా !

22. నిర్వికార హృదయా
గోపాంగనా పరివేష్టితా
నాకు మనోల్లాసము కల్గించు ఓ నల్లనయ్యా
శ్రీచందన పరిమళముతో సేవింతు నిన్ను

23. శ్యామసుందరా ! సర్వాంతర్యామి
వేణుగోపాలా వ్రజ వనిత రత్నాకరా
వేగమె రావయ్యా పద్మనయన
అమెరికా ఖండము నీకు ఆనందదాయకమె
కదుటయ్యా

24 పీతాంబర సుశోభితా ! రాధా సమేతా
అందాల బృందావన రాసకేళిలోలా
రసరాగరాగిణీ హృదయ నాయకా
మోక్షప్రదాయకా బ్రోవుమయ్యా నన్ను
ఓ చక్రపాణి

25. కృష్ణా ! మాధవా ! మధుసూదనా
యని భజియించి కీర్తింతు నిన్ను
నీ పిల్లనగ్రోవి నాద తన్మయము
నాకు ప్రసాదించు ఓ చతుర్భుజా

26 నీ ఆలయమునకు విరాళ
మొసగవలెనని నాకు అత్యంత అసక్తియున్నది
అయిన నేమిచేతును నేను అష్టసతీ పరివేష్టితా
పరిగ్రహించి అనుగ్రహించు ఈ సంకీర్తనంబు

27. ఈ నా కవితా స్తుతియే నీకు
అంకితంబు ఈ అక్షర సంపదాయమే
నీ ఆలయమునకు అధికమైన విరాళంబు
నీవే ప్రసన్న కృష్ణవని ప్రార్థించుచుంటి

28. మానసులోని మిథ్య తొలగించవయ్యా
నీ గీతోపదేశము నాకు వినిపించి
నీ పై పద్య కవిత్వము వ్రాయగల
ప్రతిభ నొసగుమయ్యా మా కృష్ణపరమాత్మా !



# శివ స్తుతి

1. శ్రీ మల్లికార్జునా ! భ్రమరాంబనాథా
భక్తులకు బహు సులభముగ
వరములొసగెడి శ్రీశైలవాసా !
పొన్నపువ్వులతోడ మేలుకొలుపుదు నిన్ను

2. శివశంకరా ! శ్రీ కాళహస్తీశ్వరా !
స్వపర భేదములు లేక దయచూపువాడా
కన్నప్ప భక్తికి సంతసించినవాడా
పానీయములతోడ నీకు అభిషేకమయ్యా

3. త్రిలోచనా ! దాక్షారామ భీమేశ్వరా
త్రినగములపై వెలసిన దయాకరా
జాగుచేయక నన్ను దయచూడవయ్యా
పన్నీటితో నీకు జలకంబులయ్యా

4. సర్పహారా ! వృషభాచలేశ్వరా !
ఆర్యాంబను మెచ్చి శంకరులను
ప్రసాదించిన దైవరాయా
నారికేళములు నీకు నైవేద్యమయ్యా !

5. రజితగిరీంద్రా ! అమరేశ్వరా !
కవులను కరుణించి కావ్యములు వ్రాయించి
శివకవులుగ తీర్చిదిద్దినవాడా !
సేవింతునయ్యా నిన్ను మధ్యాహ్న మల్లెతోడ

6. భక్తికి పరవశించి వరములిచ్చుట
నీకు పరిపాటియేగా !
కొత్త అవతారమెత్తి దానవులను
శిక్షించుట విష్ణుమూర్తికి అలవాటుయేగా !

7. నేను నీకు హామి ఇత్తునయ్యా
ఏమరుపాటులేక శక్తివంచనలేక
పరులకు ఉపకారమె గాని
కలనైన మరియొకటి తలపనయ్యా

8 నన్ను నమ్మవయ్యా ఓ నీలకంఠా
పాలింపవయ్యా పాపహరా
మన శేషశయనుడికి నేను ప్రామ ఇవ్వనయ్యా
వరము ఇచ్చినను నేను దుర్వినియోగ పరచనయ్యా!

9. నిత్య గంగా ప్రవాహ తీర వాసా !
ఛండాల రూపమున శునకములతోడ
శంకరాచార్యులకు తత్త్వము తెలిపిన
కాశీ విశ్వేశ్వరా ! త్రిభువనేశా ! మహేశా !

10. నందివాహనా ! మహాకాళేశ్వరా !
కార్తీక పున్నమికి ఉపవాసముల్
చేసితిని శివరాత్రి యపుడు
జాగరణ చేసితిని

11. శివస్తోత్రమును జపియించితిని
శివనామమున్ స్మరియించితిని
నాట్యంబు పొగడితిని నటరాజస్వామి
చంద్రకాంతలతోడ నిన్ను సేవించుచుంటి

12 మిగుల భక్తి అసక్తులతోడ
మిమ్ములను స్తుతియించి
గ్రంథరచన కావించితయ్యా
అచ్చువేయించుటకు రూకలే కరువయ్యేనయ్యా

13. గ్రంథ ముద్రణకు ధనము
ఇతర దేవతల్ ఒసగలేదయ్యా
నీవె దయ చూపవలెనయ్యా
నేను నిరుపేదనయ్యా

14. అచ్చు వేయుటకు అప్పు చేయగలేను
అప్పు చేసిన యెడల తీర్చలేను
తీర్చలేని యెడల మాట తప్పుట ఒప్పు
మాట తప్పిన యెడల నిన్ను చేరలేను

15. విరాళ మొసగుడని ప్రార్థించితిని
సహృదయు సంపన్నులన్
అయినను ఫలితంబు శూన్యమయ్యె
మరి ఏమి చేయగలనో నాకు తెలుపుమయ్యా

16 ఊళ్ళు ఏలగలేను
ఉద్యోగమున్ చెయ్యంగలేను
సాక్షాత్కరించవయ్యా ! సలహాను ఇవ్వవయ్యా
అప్పుడె లభియించు నాకు ఆత్మతృప్తి !

17. శివ మహత్యము నేను వినివుంటినయ్యా
నాకునూ వివరముగ బోధించవయ్యా
సోమశేఖరా ! టొరంటో ఆలయ నివాసా
చిదానందా ! ఓంకారనాదా !

18. నాకు దేహధారుఢ్యమున్ ఒసగుమయ్య
ఉద్యోగప్రాప్తియని దీవించి
ఈ దైవస్తుతి ప్రచురణకు వలయు
ధనము చేకూరు మార్గము చూపవయ్యా

19. నేను గొడగూచిని కాదు కాని
నీ యెడల కడు భక్తిశ్రద్ధలు కలవు నాకు
నీ పేర స్తుతి కవిత నాకు సులభసాధ్యమయ్యె
దైవములలోకెల్ల సులభుడవు నీవె తండ్రీ !

20. అఖిలాండ బ్రహ్మాండ నాయకా !
దర్శించలేనె నేను నీ అందాల మోము
తరియించవలెనె నేను నీ సేవ చేసి
ఆలసించక నన్ను ఆదుకోవయ్యా !

21. గోకర్ణ క్షేత్రనాథా ! ఆత్మలింగేశ్వరా
రావణాసురుని భక్తిని పరీక్షించి
అచట నిలచిన అనంతశక్తి సంపన్నా
కష్టజీవులను కరుణించి లాలించవయ్యా

22. కోటి సూర్యతేజా ! కోమల స్వరూపా
నువ్వుండగా నాకు చింత ఏలయని
గ్రంథ ప్రచురణకు పథకము
వేయుచుంటినయా దయచూపవయ్యా

23. ఇప్పుడే నీ దయ గోచరించినదయా
గ్రంథ ప్రచురణకు ధనము నొసగిన
దాతలందరిని దీవించవయ్యా
కనక కస్తూరి అక్షతలతో ఆశీర్వదించవయ్యా

24. పుస్తకావిష్కరణకు నువ్వు విచ్చేయ
వలెనయ్యా అంటకు నా విన్నపము
వివరించవలెనయ్యా ఏకదంతుడికి
నా కథ వినిపించవయ్యా !

25. మనసు విరిగినదయా
మమత తగ్గినదయా
ఐహిక బంధములనుండి
నాకు విముక్తి ప్రసాదించవయ్యా

26. నీవె నా దైవమని గుర్తించితయ్యా
సంపెంగలుం దెచ్చి నీ పాదపూజ
సల్పుదునయ్యా కైలాసవాసా
నిన్ను భజియించు శక్తిని అధికంబుగా యివ్వవయ్యా

27. సాంబశివా ! భవభయహరా
స్థితిలయకారా ! కాంచన హృదయా
నా అపరాధమేమైన ఉన్నచో
క్షమియించి నన్ను పాలించవయ్యా

28. ఇది ధనమూల మిదం జగత్తయా
డబ్బులేనివాడు డుబ్బుకు కొరగాడయా
రూకలేని నన్ను బికారిని చెయ్యకయ్యా
గైకొనవయ్య నా అక్షర పుష్పాంజలి !



# నాగేంద్ర స్తుతి

1. శ్రీ నాగాధిదేవా ! నాగేంద్రా !
నీ పేరు చెప్పిన చాలు
ఉలికిపడి పారిపోదురు జనులు
దయచూపవయ్యా మా నాగరాజా

2. నాకు ఊహ సహజముగ తెలియనప్పుడు
నీ పేరు నాకు వలదని ఎదురు చెప్పితిని
స్వప్నమందు నువ్వు దర్శనం బియ్యగనే
భయము చెంది ధరియించితి నీ నామము

3. నా పుత్రునికి యిప్పితిని నీ నామమూ
నా పుత్రికలకు చేర్చితిన్ నీ నామము
అన్నియున్ చేసితిన్ అతిభయముతోడ
నీ పట్ల భక్తి స్వల్పమూ భయము అధికమూ

4. నాగుల్ల చవితికి పాలుపోసితిని
నీ పుట్టకున్ చేసితి ప్రదక్షిణమ్ము
మ్రొక్కితిన్ నీకు బహువిధముల
ధ్యానించితిన్ నిన్ను కడు భయముతోడ

5. నీ నామమ్ము ధరియించినంతనే
నువ్వు తృప్తి చెందుదువు
పాలు పోసినంతనే సంతసించుదువు
నీ మనసు వెన్నయయా మహారాజ నాగరాజా !

6. నువ్వు కాటు వేయుటకు
సిద్ధపడిననూ, కాటు వేసిననూ
అవి నీ జాతి లక్షణము కనుక
ఎటులనో సర్ది చెప్పుకొనవచ్చునేమో

7. నువ్వు ఉపకారికి సామాన్యముగ
అపకారము తలపెట్టని ధీరోదాత్తుడవు
నీ పేరు చదివినంతనే భయవిహ్వలనై
పరీక్షకు ఆ పాఠమును చదువలేకపోయితిని

8. అయిననూ నువ్వాగ్రహించక
నన్ను ఉత్తీర్ణురాల్ని చేసితివయ్యా
చెట్ల చాటున నువ్వు పొంచివుందు
వేమోనని భయపడితిని

9. మల్లెపూల జడ వేసుకుని
వెన్నెలలో మంచముపై పవళించునపుడు
ఆ జడను క్రిందకి వదలి వేసినప్పుడు
నువ్వు నా జడపైకి వచ్చెదవని భయపడితిని

10. చీకటిలో నువ్వు వచ్చెదవనీ
మా ఇంటి చెట్ల గుబురులో వుందువనీ
భయము చెంది వడివడిగా
పరుగులెత్తితిని

11. నువ్వు పుట్టలోవున్నా, చెట్టుచాటున ఉన్నా
నన్ను అకారణముగా ఏమియున్ చేయవని
తెలుసుకొంటిని కానీ సహజముగ నువ్వు
విషజంతువువని జాగ్రత్తపడితిని

12. నీకు శిరమునందు మాత్రమే విషము
ఇచట చూచితిన్ నీచమానవులన్ కొందరిన్
వారికి విషము నిండియున్నది దేహమంతా
ఇది ఏమి చోద్యమో నాగరాజా !

13. ఆ సృష్టికారుడు బ్రహ్మదేవుడు
పుష్టిగా విషము వారి దేహమందు నింపి
మిగిలినది మాత్రము నాగుల తలలందు
నింపె కాబోలు!
నీ విషమునకు విరుగుడున్నదేమో కానీ
విరుగుడులేని విషము వారిది.

14 నీచుడొక్కడె చాలు
నిర్మల మనస్కుల నీటిపాల్ చేయుటకు
పాముకంటె పరమ విషపూరితులైన
ఒకరిద్దరు నీచాతి నీచులు నాకు తటస్థించి

15 తల్లడిల్ల చేయుగా గ్రహించితి
నీదు ప్రతిభ ఓ పాతాళలోక విహారా
నీ పట్ల నాభయము అతి స్వల్పము
ఆ కలియుగ నాగులతో పోల్చి చూడగా

16. ఆ కాలకూట విషనాగ మానవులన్
నా వద్దకు పంపకయ్యా ఫణిరాజా
తెలియక నీ పట్ల నే చేసిన అపరాధములు
మన్నించు ఓ ఆదిశేషా !

17. మహేశ్వరుని కంఠహారా ! నాగరాజా
నా పలుకు లాలకించవయ్యా
నేను నాగమణులు కోరుటలేదు
మహిమగల అంగుళీకమున్ అడుగుటలేదు

18. అరమరికలు లేని నా హృదయపు
అట్టడుగు నుండి ఆనందముగ
పెల్లుబికి వచ్చిన ఈ కవితాక్షర
వజ్ర భూషణమును నీ శిరమున ధరియించి

19. నీ అనుచరుల దివ్యనాదస్వర
రాగాలాపనల మధ్య
సంతోషాతిశయముతో సతీమణితో
నటసామ్రాట్‌వై ఆహ్లాదముగ

20 నర్తించు వేళ ఆమనివేళ
ఈ నాగ సరోజను దీవించి
ధన్యత చేకూర్చి శాంతి
సౌఖ్యములను ప్రసాదించు ఓ నాగరాజా !



# శ్రీ టొరంటో మురుగన్ స్తో…

1. శ్రీ గౌరి తనయా ! గాంభీర్యవదనా !
తిరుత్తణినుండి తిరిగివచ్చితివా !
మగధనుండి మాయమై వచ్చితివా !
భక్తజన రక్షకా ! టొరంటో మురుగరాజా !

2 నీలకంఠ నందనా ! నిజ సత్యరూపా !
నీ మహిమ తెలియక నేను మనుజుల
ప్రేమించి మనసు జీర్ణవస్త్రము
కావించు కొంటినయా
భక్తజన రక్షకా ! టొరంటో మురుగరాజా !

3. గజానన సోదరా ! ఖండాంతర ప్రకాశా !
మనుజుల మనముల మాలిన్యము నిర్మూలించి
దుష్టశిక్షణకు నడుము కట్టివయ్యా !
భక్తజన రక్షకా ! టొరంటో మురుగరాజా !

4. తండ్రిమాట జవదాటక త్రుటిలో
తీర్థయాత్రలు సల్పిన శక్తి స్వరూపా !
సోదరునిపై ఆగ్రహము లేదు నీకు సౌజన్యరూపా !
భక్తజన రక్షకా ! టొరంటో మురుగరాజా !

5. అజాను బాహూ ! అరవింద చరణా !
త్రిశూల హస్తా ! శరణార్థి వత్సలా !
పళని పట్నమునుండి పయనమైవచ్చిన విశ్వరూపా !
భక్తజన రక్షకా ! టొరంటో మురుగరాజా !

6. నిర్మలాంగ దేహా ! నిత్యవైభోగరాయా !
నీ సుప్రభాతంబు నీ అష్టోత్తరంబు
కల్గించెనయ్యా నాకు కనువిప్పు యిప్పుడు
భక్తజన రక్షకా ! టొరంటో మురుగరాజా !

7. తమిళరాజ్యము మా ముందు నిల్పినది తండ్రీ !
నీ దయకు మేమంత ధన్యులము అయితిమి
వల్లితల్లితో కలసి వలస వచ్చితివా మా కొరకు !
భక్తజన రక్షకా ! టొరంటో మురుగరాజా !

8. భాషా సమస్య నాకు లేకుండ చేశావు
నాబోటివారిని నీ దరికి చేర్చావు
మనుష్యులను దైవమును కలుపు నగరంబు
ఇదియేను
భక్తజన రక్షకా ! టొరంటో మురుగరాజా !

9 నా తప్పిదము తెల్సుకొంటినయ్యా
నెమలి వాహన స్వామి ! నన్ను కాపాడవయ్యా !
త్రికాలములందు నీ స్తుతి నే చేతునయ్యా
భక్తజన రక్షకా ! టొరంటో మురుగరాజా !

10. చేతనామృతమైన ముక్తిసాధన నీవయ్యా
అసధులేరని దయాకరుడివి నీవయ్యా
నీ ఋణము తీర్చుకొనుట నాకు కష్టసాధ్యమయ్యా
భక్తజన రక్షకా ! టొరంటో మురుగరాజా !

11. మా టొరంటో దేవాలయమొక
కలియుగ కైలాసమయ్యా ! అది నీ ప్రతిభేను తండ్రీ
మూడు లోకాలను మరిపించు మనోహర
దృశ్యమయ్యా !
భక్తజన రక్షకా ! టొరంటో మురుగరాజా !

12. ఏమి చెప్పుదునయా ! దేవాధిదేవా !
ఎంత పొగడుదునయా ! సౌందర్య తిలకా !
తొల్కాపియునమ్ము చదువుటకు ముందు నీ పేరె
స్మరియింతు
భక్తజన రక్షకా ! టొరంటో మురుగరాజా !

13. నిత్యాభిషేకాలు చేయించుకోను నువ్వు
పల్లకీలో ఊరేగ నువ్వు
పరువంబు వీడని యువక రత్నము నీవు
భక్తజన రక్షకా! టొరంటో మురుగరాజా!

14. నిత్య భోజనమునకు నింపఖపడు నేను
నీ అభిషేకార్చనలకు అప్పుచేయు నేను
వెండి వెంట్రుకల నేను శక్తి ఉడిగిన నేను
భక్తజన రక్షకా! టొరంటో మురుగరాజా!

15. విరాళంబొసగలేను వీధివెంట పల్లకీ
మోయలేను, పసిడిదానంబివ్వగలేను
ఎటుల ఏలుకొందువో నన్ను ఓ సిరజాకా!
భక్తజన రక్షకా! టొరంటో మురుగరాజా!

16. మనసు ద్రవియించినది నీ యెడల భక్తిచేత
కవిత్వ వ్రాయుటకు శక్తినిచ్చితివి కమనీయతేజా!
పరిగ్రహించవయ్యా ఈ అక్షర ముక్తావళి
భక్తజన రక్షకా! టొరంటో మురుగరాజా!



# నవగ్రహ స్తుతి

1. శ్రీ దివ్యరథాధిపతీ ! దివాకరా !
రక్తమాల్యాంబరధరా ! రక్తవర్ణా !
శక్తితేజంబులొసగు ఆదిత్యదేవా !
బ్రోవుమయ్య నన్ను శ్రీ సూర్యగ్రహాయః

2. మేషవాహనా ! నూలుపోగులతండ్రీ
ప్రజల దేహ మానసంబులు సేదదీర్చువాడా !
గృహసామ్రాజ్యముల శక్తినిచ్చువాడా !
బ్రోవుమయ్యా నన్ను శ్రీ చంద్రగ్రహాయః

3. శక్తిధరశ్శూలా ! చతుర్భుజా !
భాషాఖిలాషను విస్తరింప చేయువాడా !
నీ మహిమ మానవాతీతమయ్యా
బ్రోవుమయ్యా నన్ను శ్రీ అంగారకాయా !

4. శ్రీ పీతాంబరా ! దండధరశ్చ !
ఆత్మధైర్యము నిచ్చు అఖిలతేజా !
అందాల నగరమున పొందైనవాడా !
బ్రోవుమయ్యా నన్ను శ్రీ బుధగ్రహాయా !

5. గదాసి దండాయా ! కమండలాయా
విద్యనొసగువాడ ! విజ్ఞానమిచ్చువాడా !
శక్తియుక్తుల నిచ్చు నిర్మలాంగా !
బ్రోవుమయ్యా నన్ను బృహస్పతి గ్రహాయః !

6. శ్రీ భరద్వాజాయ ! శుక్రగ్రహాయః
సాంఘిక పరిచయములకు ఆటపట్టయినవాడా !
సంగీత సాహిత్యములందు ఆకాంక్ష కల్గించువాడా !
బ్రోవుమయ్యా నన్ను శ్రీ శుక్రగ్రహాయః !

7. నీలవర్ణా ! నీల మాల్యాంబరధరా !
ఎదురుచూడని చిక్కులను నెత్తిపై రుద్దువాడా !
జీవిత గతినే మార్చి జీవచ్ఛవములను చేయువాడా !
బ్రోవుమయ్యా నన్ను శ్రీ శనిగ్రహ దేవతాయః !

8 కరవాల శూలీ ! ఖడ్గ చర్మధరా !
మేఘస్సును పెంచి త్రుంచగలవాడా !
సాయుధ వాహనాయా !
బ్రోవుమయ్యా నన్ను రాహుగ్రహదేవతాయః !

9. చిత్ర వర్ణాయా ! చిత్ర గంధాయా !
చిత్ర విచిత్రమైన మార్పులు చేయువాడా !
ఎన్నో మిత్ర చిత్ర కేతుగణ నాథాయా
బ్రోవుమయ్యా నన్ను కేతుగ్రహ దేవతాయః !

10. శ్రీ నవగ్రహ రత్నంబులారా !
మీ ఐకమత్యము ఆనందదాయకంబు
మీ మహిమ పొగడుట నా తరము కాదు
శ్రీ టౌరంటో నవగ్రహ దేవతల్లారా !

11. దుర్మార్గుల దుశ్చర్యలు సహించుట
నా వల్లకాదు ఓ తండ్రులారా !
వారిని నాపైకి ఉసిగొల్పవద్దయ్యా స్వాములారా
శ్రీ టౌరంటో నవగ్రహ దేవతల్లారా !

12. ఒక్క అభిషేకమునకే ఆనందమును పొందు
అల్పసంతోషులు మీరయా !
మిమ్ము పూజించుట నాకు సంతృప్తి అయ్యలారా
శ్రీ టౌరంటో నవగ్రహ దేవతల్లారా!

13. ఉపకారికి అపకారము
తలపెట్టువారు బహు నీచమానవులయ్యా
మీ ప్రతాపము వారిపైని చూపరేమి ?
శ్రీ టౌరంటో నవగ్రహ దేవతల్లారా !

14. గ్రహములైన మీకే భయము కాబోలు
దుష్ట మానవుల చూచి ! అందుకేనా
తండ్రులారా నా పై మీ ప్రయోగము
శ్రీ టౌరంటో నవగ్రహ దేవతల్లారా !

15. దుర్మార్గుల తేనె పలుకులకు
పొంగిపోని, మోసపోని మేథస్సును
నాకు ప్రసాదించండి ఓ దివ్యస్వరూపుల్లారా !
శ్రీ టొరంటో నవగ్రహ దేవతల్లారా !

16. చీటికి మాటికి మీ నవ మిత్రులకు
క్షీరాభిషేకములు చేయించు సంపదతో
మీరు నన్ను దీవించలేదు తండ్రులారా !
శ్రీ టొరంటో నవగ్రహ దేవతల్లారా !

17. అప్పు అడిగి అయినా
కడుపు మాడ్చుకొని అయినా
మీ అభిషేకార్చనలు చేయింతు నేను
శ్రీ టొరంటో నవగ్రహ దేవతల్లారా !

18. నా కోర్కె మన్నించుడయ్యా
దుర్మార్గులను నాకు దూరముగ ఉంచుడయ్యా
కారణము లేకనే పగబూను మనుజుల
నేమందురయ్యా !
శ్రీ టొరంటో నవగ్రహ దేవతల్లారా !

19 దీనులందు దయచూపుట న్యాయమయ్యా
నమ్మక ద్రోహులను శిక్షించుట మీ కర్తవ్యమయ్యా
పరుష వాక్కుల వారిని పారద్రోలండయా
శ్రీ టొరంటో నవగ్రహ దేవతల్లారా !

20. నా బాధ పంచుకొని ఓదార్చువారు
నాకు లేరయ్యా మీపై కవిత వ్రాయుచే
నాకు సుగమమయ్యా ! అలకించండయా
శ్రీ టౌరంటో నవగ్రహ దేవతల్లారా !

21. మీ మహాత్మ్యము యెడల నా నమ్మకము
వమ్ముకాదని నాకు ధృడవిశ్వాసమో
రాజీవనయనులారా ! రమ్యచరితులారా !
శ్రీ టౌరంటో నవగ్రహ దేవతల్లారా !

22. మీలోని ఐకమత్యము
మానవులలో కానరాదేమయా !
కనులు విప్పండయా !
శ్రీ టౌరంటో నవగ్రహ దేవతల్లారా !

23. మీ నిత్య వైభోగము నాకు
కన్నుల పండుగగ వెలుగొందు చున్నదయ్యా
నా కవితా జ్యోతికి చమురు పోయండయా
శ్రీ టౌరంటో నవగ్రహ దేవతల్లారా !

24. ఈ నా అక్షరాభిషేకాన్ని స్వీకరించి
శాంతి పన్నీరు చిలకరించి
సౌభాగ్య కలశలకు పసుపు అద్ది ఆశీర్వదించండి
శ్రీ టౌరంటో నవగ్రహ దేవతల్లారా !



# శ్రీ సత్యనారాయణ ప్రార్థన

1. శ్రీ సత్యనారాయణ స్వామి
ఆంధ్రదేశపు జనుల అవతారమూర్తి
శుభకార్యములకు మూలవిరాట్టయినవాడా
పాలింపవయ్యా నీ భక్తులము మేము

2. దేశదేశాల యందూ
వివిధ భాషలలోనూ
దినదిన ప్రవర్ధమానమై
అలరారుచున్నది నీ వ్రతకథామహిమ

2 రమా సహిత సత్యనారాయణా
కోరిన వరము లియ్యవయ్యా
ఇడుములను బాపవయ్యా
ఆయుఃరారోగ్య ఐశ్వర్యము లొసగవయ్యా

4. నిండు పున్నమినాడు
నీ వ్రతము చేతును
సకల పుష్పాలతో పూజింతు నిన్ను
మరువక ప్రసాదము స్వీకరింతు

5. గంభీరాకృతితోడ అర్చింతు నిన్ను
కావుమయ్యా నన్ను కమల నయనా
నువ్వే మా ఆంధ్రదేశపు దైవమని
ఆనందముతో గర్వించుచుంటినయ్యా

6. నీ చిరు దరహాసమే నాకు
కనుల వెన్నెల
నీ వ్రత కథయే మాకు తృప్తిబాట
పాలింపవయ్యా ఓ సత్య చక్రవర్తీ

7. ఈ నగర ఆలయమందు
నీ వ్రతములే నిత్య సౌభాగ్య
సంపదలు మా సత్యదేవా !
ప్రమోదముతో ప్రణమిల్లు చుంటినయ్యా నీకు

8 సత్యనారాయణ స్వామి
సకలార్థ సిద్ధి ప్రదాతా
అందుకోవుమయ్యా
నా అక్షరాభినందన మా ఆంధ్రదేవా !



# పేరంటాల శ్రీ మహాలక్ష్మి స్తుతి

1. శ్రీ విష్ణుపత్నీ ! శ్రీ చంద్రవదనా !
కరుణతో కదలివచ్చిన సౌభాగ్యవల్లీ
వచ్చినది కాబోలు ఈ శీతలసీమ నీకు
మా తల్లి పేరంటో శ్రీమహాలక్ష్మి

2 శ్రీ పద్మగంధీ ! శ్రీ బిల్వానిలయా
వచ్చినవారికి కురిపింతువు నీవు
ధన కనక వస్తువాహన గౌరవ వర్షం
మా తల్లి పేరంటో శ్రీమహాలక్ష్మి

3. శ్రీ లోకమాతా ! శ్రీ ధర్మ నిలయా
బంగారు చెంగావి వస్త్రాలు ధరియించి
రత్నాల హారాల రమ్యతను తిలకించు
మా తల్లి పేరంటో శ్రీమహాలక్ష్మి

4. శ్రీ పుణ్యగంధీ ! కమలాయతాక్షీ !
తూగుటుయ్యాల లూగుచూ బంతులాడుచునూ
మేజువాణులు జరుపుకొను మేల్మి కలిమి
మా తల్లి పేరంటో శ్రీమహాలక్ష్మి

5. శ్రీ రమాదేవి ! శ్రీ అమృతాయా !
కోడలమ్మతో సంధి కుదరదా నీకు !
భారతీదేవిని వదలి వచ్చావు నీవు, మారింది కాలం
మా తల్లి టొరంటో శ్రీమహాలక్ష్మి

6. శ్రీ అశోకాయా ! శ్రీ హరి వల్లభాయా !
శారదమ్మ మెరుగు నీకన్న
కష్టపడిన తగు ఫలితంబునిచ్చు
మా తల్లి టొరంటో శ్రీమహాలక్ష్మి

7 శ్రీ విశ్వజనని ! శ్రీ ప్రసన్నాక్షి !
ప్రీతితో నిన్ను స్తుతియించు నాబోటివారిని
కడగండ్లపాలు చేయుట వినోదమా నీకు !
మా తల్లి టొరంటో శ్రీమహాలక్ష్మి

8. త్రికాలజ్ఞాని ! శ్రీ ఉదారాంగా !
చిన్నారి పొన్నారి నాటినుండీ
నిన్నే గద్దె ఎక్కించి నిన్నే మనసార నమ్మితిని
మా తల్లి టొరంటో శ్రీమహాలక్ష్మి

9. శ్రీ సుప్రసన్నా ! శ్రీ భాగ్యరేఖా !
వీణాపాణిని నేను ప్రస్తుతించినది
బహు స్వల్పమే కాని
జాలి చూపినది ఆమె నా జన్మ తరియించుటకు
మా తల్లి టొరంటో శ్రీమహాలక్ష్మి

10. శ్రీ నిత్యపుష్టా ! క్షీరాబ్ధితనయా !
మడులు కోరలేదు నేను మాన్యాలు అడగలేదు
సుఖజీవనమునకు వలయు సిరి నివ్వమన్నాను
మా తల్లి టొరంటో శ్రీమహాలక్ష్మి

11. శ్రీ దారిద్ర్య ధ్వంసినీ ! శ్రీ ఆదిలక్ష్మి !
మరి ఏల దయలేదు నీకు నాపైన
ఇది ఏమి దేవనీతి ! వైకుంఠపాళి !
మా తల్లి టొరంటో శ్రీమహాలక్ష్మి

12 శ్రీ వరలక్ష్మి ! శ్రీ ధనలక్ష్మి !
ప్రేమమీరగా భక్తితో నిన్ను సేవించి
పూజించి పూజించి విసిగితిని నేను
మా తల్లి టొరంటో శ్రీమహాలక్ష్మి

13 శ్రీ వసుధారిణీ ! శ్రీ మోహనాంగి !
భజనచేసితిని నేను సాటి మనుష్యుల
ప్రేమించి ఆదరించి, న్యాయమేలేదు
మా తల్లి టొరంటో శ్రీమహాలక్ష్మి

14 శ్రీ [illegible] ! శ్రీ మంగళాదేవి !
[illegible] కనికరము లక్ష్యము
నాకు [illegible] లేదు ఇది ఏమి గొప్ప నైజము
మా తల్లి టొరంటో శ్రీమహాలక్ష్మి

15. శ్రీ విశ్వజననీ ! ఆహ్లాదవందిత
ధనలక్ష్మియుతున్ననూ దర్శనభాగ్యము
కల్పించుచుంటివి మా నగర దేవాలయమునందు
మా తల్లి బొరంటో శ్రీమహాలక్ష్మి

16 శ్రీ యశస్వినీ ! సంపన్నవాణీ !
నిన్ను స్తుతియించి భజియించి అలసినది దేహము
మదిమి ముంచుకవచ్చె ! చూపు మందగించె
మా తల్లి టొరంటో శ్రీమహాలక్ష్మి

17. శ్రీ లక్ష్మి ప్రసీదా ! శ్రీ ధాన్యలక్ష్మి !
పారద్రోలు నా అజ్ఞాన తిమిరాన్ని
నడిపించుము నన్ను వెలుగులోకి
మా తల్లి టొరంటో శ్రీమహాలక్ష్మి

18. శ్రీ జగన్మాతా ! శ్రీ సిలవేణీ !
శుభము స్తనుచు నన్ను దీవించవమ్మా
అందుకోవమ్మ నా వచన కవితామాల
మా తల్లి టొరంటో శ్రీమహాలక్ష్మి

# My Divine Mother, Toronto Sri Mahalaxmi

(Dr. Sudarsan Raj, Edmonton, Canada)

O Lord Vishnu's consort ! What a radiant glow !
Adoring this beautiful land of snow
Mother of mercy, Goddess Sri laxmi
My divine mother, Toronto Mahalaxmi.

Pervading fragrance with they presence
Showering grace on people of indolence
Making them famous fat cats, O mother Laxmi
My divine mother, Toronto Mahalaxmi.

O divine mother ! full of just and peace
Wearing silky brocades and sapphires' necklace
Looking graceful, O mother Sri Laxmi
My divine mother, Toronto Mahalaxmi.

Emitting smell of perfumes, and thine lotus eyes
Swinging in cradles and enjoying flowers
Gracing the functions, and celestial dances
My divine mother, Toronto Mahalaxmi.

Didn't you find peace with in-laws mother ?
Why did you leave beautiful Bharat dear ?
O mother Rama ! Did you run away out of fear ?
My divine mother, Toronto Mahalaxmi.

O mother Laxmi ! Beloved of Lord Hari
I dare say, mother Sarada bestows much better
I say this with vengeance and anger
My divine mother, Toronto Mahalaxmi.

Reveal thyself, O Universal mother !
I worship you in my heart as a treasure
But, why do you ignore me ever with pleasure ?
My divine mother, Toronto Mahalaxmi.

Knower of the past, the present, and the future
I kept you with esteem on a very high altar
With great respect, trust, and honor
My divine mother, Toronto Mahalaxmi.

My literary efforts brought me laurels in a way
Some more effort honored me in an unexpected way
Merciful Saraswati extolled you in every way
My divine mother, Toronto Mahalaxmi.

O mejestic daughter of maighty milky ocean !
Did I ever ask you dollars in million or billion ?
Comfortable living, what I want in every season
My divine mother, Toronto Mahalaxmi.

O mother Adi Laxmi ! The chaser of indigence
But, I dare say, thou art merciless
Is it heavenly justice ? or a divine curse ?
My divine mother, Toronto Mahalaxmi.

O Varalaxmi ! Mother of good fortune
I served you with love and devotion
Facing the results with utter desperation
My divine mother, Toronto Mahalaxmi.

I faced insults among my friends
Making mistakes in grasping their trends
How can I reconcile ? My mother Laxmi ?
My divine mother, Toronto Mahalaxmi.

O mother of wisdom, success, and limitless fame
The more affection I show, the more I get defame
Is it the justice ? or you want to put me in shame
My divine mother, Toronto Mahalaxmi.

O universal mother ! how joyful you are !
Giving a glimpse of vision, if not a treasure
In our city of Toronto, with great pleasure
My divine mother, Toronto Mahalaxmi.

O famous mother ! My mother fabulous
I pray and praise, till my body withers
Even I become old, and my eye-sight bothers
My divine mother, Toronto Mahalaxmi.

O bestowal of riches ! the supplier of food
Dispel my ignorance and do some good
Lead me to light, that is what I need
My divine mother, Toronto Mahalaxmi.

My humble salutations to you mother
I need your blessings, O universal savior !
Accept a small garland of my verses dear
My divine mother, Toronto Mahalaxmi.

(Free verse translation to Smt. K. Saroja's
"Toronto Sri Mahalaxmi Stuti")



# శ్రీ శారదా ఆగమన స్తుతి

1. శ్రీ వాణీ గీర్వాణీ !
నిత్య నిరాడంబర నిజతేజ రాశీ
కరుణించు మాయమ్మ ఓ కనకవల్లీ !
జాగు సేయక కదలి రావమ్మ ఈ ఖండమునకు

2 శ్రీ శారదాంబా ! శ్రీ సత్యవాణీ ।
శ్వేతాంబరధారిణీ వీణా పుస్తకపాణీ
పద్మాసన పవిత్రాణీ పంకజాక్షీ
ఆలసించక కదలి రావమ్మ ఈ ఖండమునకు

3. శ్రీ కీరవాణీ మృదు మధుర చరితా
నిన్ను దర్శించవలెనని నాకు మనసాయెనమ్మా
ఎటుల దర్శింతు నిన్ను ఓ పలుకు తేనెల రాణీ !
శీఘ్రముగ కదలి రావమ్మ ఈ ఖండమునకు

4. శ్రీ చతుర్వాణీ ! బ్రహ్మదేవుని రాణీ
కవుల నాల్కలపై నర్తించు కళ్యాణగాత్రీ
నృత్య గాన సాహిత్య విభవ చిత్రకళా విద్విలాసీ
తక్షణమె కదలి రావమ్మ ఈ ఖండమునకు

5. శ్రీ భారతమ్మా హంసవాహన దేవి
అలయములేదని నీవు చింతించవలదు ఓ నీరజాక్షి
లలితకళా సృష్టి స్థితి లయకారిణీ
నా వైశాల హృదయంబు నీకు ఆలయము
ఓ నీలవేణీ !

6. ఓ శృతి లయ రాగ చరణ సమన్విత సుందరీ !
నా శక్తివంచనలేక నిన్ను పూజించి
స్తుతియింతునమ్మా
నన్ను దీవించవమ్మా నాకు వాక్ స్రవంతిని
ప్రసాదించవమ్మా
ఆలయమందున్న మీ అత్త నాపై
దయచూపలేదు తల్లీ !

7. శ్రీ శార్వాణీ ! త్రిభువన వందిత
విన్నావా మీ అత్త పక్షపాత కథ
చిరునవ్వుల నా వాణీ నీకు లేదు అస్థిరం
పాలించరావమ్మా ! నన్నేలుకోవమ్మా
ఓ సరస్వతమ్మ

8 నీ దయా పారిజాతాల పరిమళము
వాసనే నేను వ్రాయుగల్గితిని
ఈ దైవస్తుతి వచన కవితామాల
గైకొని ఆశీర్వదించి ఆనందింపజేయవమ్మా



# ఉమా స్తుతి

1. శ్రీ శంకర ప్రియా ! శైలేంద్ర తనయా !
పారిజాతాలతో నిన్ను పూజింతు నేను
పలుకరాదటమ్మ ఓ పంకజాక్షీ !
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

2. కటాక్ష వీక్షణాపేక్ష కమలాక్షీ !
నీ పూజ సలిపితిని నీ నోము నోచితిని
స్వర్ణ గన్నేరు పూలతో స్మరియింతు నిన్ను
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

3. సింహ వాహనా ! ఓ కైలాస వాసినీ !
అలనాటి మహిషాసుర మర్దినీ !
మరి ఏల మౌనముద్ర యిపుడు !
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

4. చండికాదేవీ ! ముఖపద్మ లావణ్యా
మల్లెమాలికలతోడ మరువంబుతోడ
ఎల్లవేళల నిన్ను కొలిచెదను తల్లీ
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

5. కాశీ అన్నపూర్ణా ! కరుణా ప్రవంతీ !
జాహ్నవిని గాంచి అసూయచెందని కర్ణలక్ష్మీ !
సన్నజాజులతోడ సన్నుతింతున్ తల్లీ
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

6. విఘ్ననాయకునికి ముద్దుగ
ప్రాణంబు నొసగిన సల్లాప లక్ష్మి
అమ్మప్రేమలేక అల్లాడుచుంటి
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

7. జయ జననీ ! దాక్షాయణీ
స్నేహవీచికలు లేక చింతించుచుంటి
భాషించవమ్మా అనురాగ వల్లీ !
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

8. నా కోర్కె దీర్పు ఓ నటరాజ పత్నీ !
నా సుకుమార హృదయమును
బండరాయిగ మార్చుమో భవ్య చరితా
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

9. కాంచీపురము రాలేను ఓ గౌరహస్తా
కాశీకి రాలేను ఓ అపరాజితాయా !
అగ్రహము పూనకు నా పైన అఖిలాండకోటిప్రభా
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

10. ఈ నగరమందు నెలకొన్న నిన్ను
చిటికిన్ మాటికిన్ దర్శించలేను
భక్తులను దయతోడ బ్రోచు పార్వతీదేవీ !
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయ

11. కారు నడపగలేను
కనక పూర్జించగలేను
కాలినడకన నీ ఆలయము చేరలేను
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

12. శక్తి స్వరూపిణీ ! నవదుర్గా !
పోతనామాత్యుని స్తుతికి తృప్తి చెందిన సంతోషవాణీ !
మొగలి రేకులు తెచ్చి ప్రార్థింతు నిన్ను !
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

13. రాక్షస ప్రాణ మథనాయా !
మానవులలోని దానవులకు
బహు స్వేచ్ఛ నొసగితివిగా
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

14. నీకుకూడ సాకుదొరికినద తల్లి !
సమయమ్ములేదా ! లేక సమయంబుకాదా !
ఇది ఈ దేశ రాజకీయ చతురతమ్మా
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

15. శత్రుసంహార శస్త్రాంగాయా !
జనులను స్వపర భేదము లేక
ప్రాణాధికముగ ప్రేమించితిని నేను
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

16 అది ఏమి చోద్యమో అఖిలాండేశ్వరీ !
మిత్రులొక్కరు నాకు మిగులలేదు కడకు
గ్రహించితినమ్మ నీవె నా నేస్తమనీ
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

17. పరమేశ్వరి ! రాజేశ్వరీ
సర్వాలంకార భూషితవై
జలతారు అరుణ వర్ణపు చీరధరియించి వచ్చి
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

18. నుదుట ఎర్రని కుంకుమతో
పసుపు పూసిన పాదాలతో
తెల్లని మెట్టెల వ్రేళ్లతో విచ్చేసి
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

19. అందెల రవళులతో ఆనందముగ
నాకు దర్శనమియవమ్మ ఓ గాయత్రీ !
స్వప్నమునందైనను సంబరపడుదునమ్మ
పాలింపవమ్మా మాణిక్య మంగళ కాత్యాయనీ !

20 నీ మంగళ సూత్రము ధగధగ మెరయుగా
నా ఈ స్తుతి మందారమాల స్వీకరించి
ధైర్యమే ధనముగా నొసగి ఆదరించి కాంచన కేతలలో
దీర్ఘసుమంగళీభవ యని దీవించుమో గౌరదేవి.



# శ్రీ తులసి వందనం

1. శ్రీ తులసీ ! మంగళరూపిణీ
మహిమగల తల్లి మనోజ్ఞవల్లి
మరువక నీ నామము తలతునమ్మా
మంగళ శోభతో నన్ను బ్రోవవమ్మ

2. నీ ప్రదక్షిణము చేతు నీ పూజ చేతు
ఆత్మనమస్కారము చేతునో తులసిదేవి
ముద్దమందారములతో ముదమార పూజింతు
పసుపు కుంకుమలతో ప్రార్థింతునూ

3. విష్ణుతులసీ శ్రీకృష్ణతులసీ
శుభపరిమళాంగీ
ఆరోగ్య దాయినీ
కదలి రావమ్మ ఓ పవిత్రాంగి

4. ఘనకీర్తి చరితా లక్ష్మీప్రతాపా
ఎవ్వరమ్మా నీ సాటి ఈ జగమునందు
అందుకోవమ్మ నా వందన సహస్రంబు
సర్వమంగళ ఫలప్రదయని దీవించవమ్మా

# గోమాతా

1. గోమాతా ! లక్ష్మీ ! కళ్యాణి
శుభ సత్ఫలిత సౌందర్యరాశీ
నీ ప్రముఖత్వం నేనెరుగుదును తల్లీ
కనుమనాడు నీ పండుగ
జరుపలేక పోవుచుంటి నిచట

2. ఈ అమెరికా ఖండమందు
టొరంటో నగరమందు
మా గృహప్రవేశమునాడు నీకు
పూజలే చేయనిదాననైతిని

నీవు లేని కొరత నిజమైన కొరత

3 శుభాశుభములకు గోదానం
ముక్తి మోక్ష సాధనం !
నీ రూపం సాధు సజ్జన మిళితం
నీ క్షీర మాధుర్యం అమృత తుల్యం

4 భారతదేశమందు
హైందవ ఆచారమందు
పరమ పవిత్రమూర్తివై విరాజిల్లుచున్న
సాదు స్వభావీ ! నీకిదే నా అంజలి
కపలి ధావమ్మ ఇచటికి

# పోతన

1. సుకవి శ్రీ బమ్మెర పోతనామాత్యా !
ఈ దైవస్తుతి వచన కవితలు
వ్రాయు చుండగ నీ దర్శన
భాగ్యము కల్గినది నా స్వప్నమందు

2. కైవల్య పదంబు చేరుటకునై
యని అనుదినము నీ పద్య పఠనము
చేయు నాపై నీకు దయగల్గినదా కవివర్యా
నా ఆనందమునకు మేరయే లేదు

3. అంత పొడవు, పొట్టికాని
ముచ్చటైన కాయమ్ముతోడ
బంగారు రంగు సరిగ ధోవతియున్
ఉత్తరీయమున్ ధరియించి

4. కవి సమ్మేళమునకై ఇచటికి
విచ్చేసిన మీ సుందర సౌకుమార్య
రూపం నేను మరువ జాలనయ్యా
నీ కవిత్వముతో నన్ను దీవించు
నా ప్రియతమ కవి పోతనామాత్యా !



# భరతమాత

భరత మాతా ! భవ్యతేజా
త్రివేణీ సంగమ కీర్తిప్రభా !
కృష్ణా, గోదావరీ, పెన్నల
పరమ పవిత్ర జల స్రవంతుల్లారా
తెలుగు ముత్తయిదువుల్లారా
కావేరిని కలుపుకుని
కదలిరండమ్మ యిచటికి
మీ నిర్మల నిశ్చల
ప్రవాహము వలె ఈ
దైవస్తుతి రచనా స్రవంతిని
నాకు ప్రసాదించిన
ఓ నా తల్లులారా
విజయదశమినాడు
జరుగబోవు దైవసన్నుతి
ఆవిష్కరణకు
విచ్చేయ వలెనమ్మా మీరు
నదీమ తల్లులను దర్శించితి
నా స్వప్నమందు
ధన్యురాలనైతిని నిజ జీవితమునందు
నమస్సులమ్మ మీకు



# O Loving Lord ! Sri Sathya Sai

(Dr. Sudarsan Raj, Edmonton, Canada)

When I was young I prayed to Jesus
By the influence of Christian teachers
I left Jesus since the death of my parents
O Loving Lord ! Sri Sathya Sai.

Hope and despair troubled my life
You came as Satyamamba in my life
Then came Shirdi Sai through my wife
O Loving Lord ! Sri Sathya Sai.

You were Rama in Treta Yuga
You were Krishna in Dwapara Yuga
You came to dispel darkness in this Kali Yuga
O Loving Lord ! Sri Sathya Sai.

I didn't trust you since I am a scientist
Behaving like a great idealist
I always imagined God as a spirit
O Loving Lord ! Sri Sathya Sai.

I wondered why you appeared in my dream ?
I didn't realize it was a visiting card from the
Supreme
Guiding people who come with high esteem
O Loving Lord ! Sri Sathya Sai.

You came on earth in human form
To make the matters simple and warm
Wicked people turn it as an alarm
O Loving Lord ! Sri Sathya Sai.

It is difficult to fathom your power
Despite small in figure, you stand as a
great tower
How can we mortals gauge your atomic power ?
O Loving Lord ! Sri Sathya Sai.

With the presence, and with thine grace
Created Prasanthi Nilayam, The Abode of Peace
A Sanctum Sanctorum on the world's surface
O Loving Lord ! Sri Sathya Sai.

Far and away, across the seas
People come and swarm as bees
You bless them always in peace
O Loving Lord ! Sri Sathya Sai.

You give the atheists gifts to allure
They become your devotees later, for sure
I always wonder, what a best cure ?
O Loving Lord ! Sri Sathya Sai.

When I was in danger, I sent a soul call
You responded quickly to my emergency call
Needless to say, I was saved from a great fall
O Loving Lord ! Sri Sathya Sai.

I fold my hands with obedience
I bow my head with reverence
To my fellow beings it is a suspense
O Loving Lord ! Sri Sathya Sai.

I am the bubble, Thou art the ocean
I am a ray, Thou are the Sun
I am an atom, Thou are the creation
O Loving Lord ! Sri Sathya Sai.

You know that thou art Divine
I know not that I too am Divine
That is the difference I can't imagine
O Loving Lord ! Sri Sathya Sai.

Scientists boast of creating energy from matter
How ignorant they are in such a matter ?
You do the reverse with full control over the Nature
O Loving Lord ! Sri Sathya Sai.

Omnipresence, Omnipotence, and Omniscience is thy nature
You know my past, present, and future
Forgive my past, correct my present, and carve my future
O Loving Lord ! Sri Sathya Sai.

How lucky I am to be born in human norm ?
To enjoy the God's presence in physical form
God as Shirdi Sai, Satya Sai, and Prema Sai
O Loving Lord ! Sri Sathya Sai.

I surrender myself with great veneration
Chisel and carve me without hesitation
Bless and grant me long-awaited liberation
O Loving Lord ! Sri Sathya Sai.